Regd No. N. 45 / M. 3813

(10263)

వెల ఒక అణా

మాప్రచురములు
గోలకొండ కవుల సంచిక ౧౦రూ.
గయాపాఖ్యానము ప్రాచీనవిధి } ౪ అ.
ఉచ్చులవిహీన నాటకము ౯ ,,
నిజాంరాష్ట్ర పరిపాలనం ౪ ,,
ధరలన్నీ చాలతగ్గింపబడినవి,
గోలకొండ పత్రికాలయం

# గోలకొండపత్రిక

ప్రతి సోమ గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

హిందువుల పండుగలు
కర్త సు. ప్రతాపరెడ్డి
౩౦౦ పుటలు ౫ రూపాయలు
కల గ్రంథాలు మాత్రమే.
మేనేజరు గోలకొండపత్రిక

సంపుటము ౧౬ ★ హైద్రాబాదు,దక్కన్. శా. శ. ౧౮౬౩ వృషసం॥ర మార్గశిర బ॥ ౩౦ (౧౮-౩-౧౩౫౧ ఫ.) గురువారము సంచిక ౬౩

# బర్మాలో జపాను సేనల ప్రవేశము

## రంగూనుకు ౫౦౦ మైళ్ళ దూరములో ఉన్నారు

### రంగూనుపై తీవ్రమైన శత్రువిమానాల దాడులు

డిసెంబరు ౧౫వ తేదినుండి ౧౮వ తేదివరకు వచ్చిన జపానుయుద్ధవార్తలలో మొట్టమొదటగ గమనించదగినవిశేషము ఈ యుద్ధము భారతదేశమునకు సమీపించుచుండుటను గురించినది- భారతదేశమునకు తూర్పునఆనుకొనియుండు బర్మా ప్రధాననగరము రంగూనులో డిసెంబరు ౧౫వ తేది మధ్యాహ్నమున శత్రువిమానాలుదాడికై వచ్చుచున్నట్లు హెచ్చరికగంటలు మ్రోగించబడినవి- టౌన్గూకు ఉత్తరముగా ౫౦ మైళ్ళదూరమున ఎవరిదో ఒకవిమానము కనబడుటవల్లను, మెర్గినుండి రంగూనువైపుగా ౧౨ బాంబువిమానములువచ్చుచున్నట్లువార్త రంగూనులో సైనిక కార్యాలయానికి వచ్చినందువల్లను ఈవిమానాలదాడుల హెచ్చరిక గావించబడినదట. ఆదేవమువారు మాగ్వె టెనాసెరి ప్రాంతమునకు శత్రువిమానములు రెండుపర్యాయములువచ్చిపోయినవి- డిసెంబరు ౧౬వ తేది నాటికి జపానీయసేనలు థాయిలాండునుదాటి బర్మాదక్షిణపుకొనను, రంగూనుకు ఆగ్నేయముగ ౫౦౦ మైళ్ళ దూరములోనున్న క్రాఇస్తమస్నందు పాయింట్ విక్టోరియా అను కోటికి చేరినట్లు తెలిసినది- చైనా సేనలు థాయిలాండులోకి ప్రవేశించినట్లును థాయిలాండుసేనలువాటిని ప్రతిఘటించుచున్నట్లును జపానువారు ప్రకటించినారు. ఉత్తరథాయిలాండులో బర్మాసేనలతో పోరాటముజరుగుచున్నట్లు జపానువైపునుండి వార్తలువచ్చినవికాని బర్మాలోనిఅధికారులు ఇదిఅబద్ధమనినారు-

ఇక థాయిలాండువ్యవహారము. ఈదేశములోనికి బ్రిటిషుసేనలు మలయానుండి చొరబడినట్లు జపానువారలు ఇదివరలో తెలిపినవార్త ఇప్పుడుఅసత్యమని బ్రిటిషువారిచే ఖండనచేయబడినది- థాయిలాండు జపానువారలకు లొంగిపోయినదనుకారణముచే అమెరికావారు తమదేశములో థాయిలాండుదేశీయుల ఆస్తులు ఏవేవిఉన్నవో అవిథాయిలాండుకుపోకుండ కట్టుదిట్టములుచేసిరి. దానికిప్రతిక్రియగా థాయిలాండు ప్రభుత్వమువారును తమదేశములో అమెరికావారలయొక్కయు బ్రిటిషువారలయొక్కయు ఆస్తులేవేవియున్నవో వాటినిపూర్తిగా వశపరచుకొన్నారని డిసెంబరు ౧౮వ తేదినాటి ఇటాలీయరేడియోలో చెప్పబడినది.

ఇక మలయాలో పోరాటముసంగతి-ఇక్కడ కోటబారు అను విమానాశ్రయముచుట్టును యుద్ధముజరుగుచుండినట్లును, బ్రిటిషుసేనలు కొంత వెనుకకునడచిపోయి క్రొత్తస్థానములను ఏర్పరచుకొనినట్లును గతసంచికలో చూచియుంటిమి కదా! ఇప్పుడుఆకోటబారు జపానులవశమైనట్లు ఒకవార్తవచ్చినది, అక్కడ బ్రిటిషువారికి విమానాలు తక్కువగా ఉండుటవల్ల ఇట్లుజరిగెనని "డెయిలీహెరాల్డు" అను బ్రిటిషుపత్రికయొక్క విశేషి డిసెంబరు ౧౬వ తేదినాటిఆపత్రిక సంచికలో తెలిపినాడు. డిసంబరు ౧౬వ తేదిన జపానువారు కెడావద్ద కొన్నిస్థానాలనుఆక్రమించిరి-కానికెడావద్ద యింకనుయుద్ధము సాగుచునేయున్నది-ఇక్కడ బ్రిటిషుసేనలు కొంత వెనుకకుమరలించబడినవి. ఈకెడాప్రాంతము మలయావాయవ్య దిశనున్నది, తర్వాతఇప్పుడు క్వాలాకెంగను, డన్గనుఅనుచోట్లకూడ జపానుసేనలు జొరబడినటుల కొన్నివార్తలువచ్చినవి. కానిఅవి బ్రిటిషుఅధికారులచే ప్రకటింపబడలేదు.

కోటబారువద్ద జరిగినఒకసంగతి గమనించదగినది-ఇక్కడ జపానుసేనలఒత్తిడి ఎక్కువైన తర్వాత బ్రిటిషుసేనలు విలువగలప్రతిదానినిధ్వంసము చేసివెళ్లిపోయెను-కాని ఒక బ్రిటిషుసైనికాధికారియు ౧౫మందిభారతీయసైనికులునుకొనవరకు పోరాడుచుండుటవల్ల వలలోచిక్కినట్లయిన బ్రిటిషుసేన తప్పించుకొనిపోగలిగినది-కాని ఆసైనికాధికారియు ౧౫మంది భారతీయసైనికులును సజీవులైయుందురనినమ్ముటకు ఇప్పుడువీలులేకుండ పోయినది.

బ్రిటిషువారికి మలయాలో విమానములుతక్కువఅని అనుకొనుచుండగా ఆస్ట్రేలియానుండి వచ్చినవిమానములువచ్చినవి. ఇవికూడ ఇప్పుడుచాలవట. ఇంకను ఎక్కువసహాయము వచ్చినకేగాని జపానువారలను మలయానుండి తరిమివేయుటకువీలులేకున్నదని రూటరువిశేషి తెలిపినాడు. ఈ యుద్ధప్రారంభమున బ్రిటిషువారివిమానాలు ఏమియు చేయజాలకుండ జపానువారి విమానాలు ఒక్కసారియాననే అనేకములైనచోట్ల దెబ్బలువేసి కంగారుపెట్టినవనియు, మలయా అడవులలో జపానుసేనలు ఆప్రాంతమున పరిచయముగలవాటివలెనే మహావేగముగా బ్రిటిషుసేనలకు తెలియకుండ ముందుకు సాగిపోవుచున్నవనియు రూటరువిశేషి వ్రాసినాడు. బ్రిటిషువారు ముందుముందుకొని కొన్నిస్థానాలను వదలుకొని సింగపూరువరకుకూడ పోవలసివచ్చినను ఆశ్చర్యపడరాదనునట్లును అవిశేషి సూచించినాడు. జపానువారివిమానాలను జర్మనులనడిపించుచున్నారేమోయని బ్రిటిషుఅధికారులు ఎంతజాగ్రత్తగా చూచినను, అవిధముగాజరుగుచున్నట్లు కనిపించలేదు- అందువల్ల జపానువారి విమానసామర్థ్యముకూడ మెచ్చుకొన్నట్లయినది.

ఈమలయాలో జపానువిమానాలదాడుల ఫలితములుకూడ గమనించదగినవి. డిసెంబరు ౧౫వ తేదిఉదయము పెనాంగుపై చాలతీవ్రమైన దాడి జరిగినది-అందువల్లచాలాఆస్తులు నష్టమైనవి-౧౬వ తేదిన ఇక్కడ మొత్తము అయిదు జపానువిమానాలను బ్రిటిషువారు కూల్చినారు. ౧౮వ తేదిన జపానీయవిమానాలు రెండుసారులు పెనాంగుపై బాంబులనువేసినవి-ఇప్పుడు అక్కడినుండి అయిదువందలమంది యూరపియస్త్రీశిశువులను మలయాలో ఇతరస్థలాలకు పంపించివేసినారు-ఈదాడులకులోనే బ్రిటిషువిమానాలును జపానుసేనల స్థలాలపై దాడులనుచేయుచున్నవి. డిసెంబరు౧౬వ తేదిన బ్రిటిషుమిత్రమండలివారివిమానాలు సింగోరాపైకిపోయి బాంబులనువేసినవి-

ఇక హాంగుకాంగులో యుద్ధముసంగతి గమనింతము- ఇక్కడకూడ బ్రిటిషు పక్షమువారికి ఉత్సాహకరమైన వార్త ముఖ్యమైనదిలేదు,

ఇక్కడజపానుసేనల ఒత్తిడివిపులమగుటచే బ్రిటిషుసేనలుకౌలూనువైపును విడిచిపోవుచున్నట్లుడిసెంబరు౧౨వ తేదినాటివార్తలలోనుండెను- అయినా టికిజపానుసేనలుకౌలూనునుఆక్రమించుకొనినట్లు వార్తవచ్చినది, ౧౫వ తేదినాటికి హాంగ్కాంగునుఎదురుగా ౩౦ చదరపుమైళ్ళప్రదేశమును ఆక్రమించినట్లువార్తవచ్చినది. శాంతముగాలొంగిపోవలసినదనిజపానువారలు హాంగుకాంగురక్షకసేనలనుకోరగా,అవిఅందుకుసమ్మతించనందున జపానువారలు డిసెంబరు౧౮వ తేదిన దానిపైఫిరంగుల వర్షమును హాంగుకాంగుపై కురిపించనారంభించిరి.

ఈహాంగుకాంగులో పోరాడుచున్న జపానుసేనలనువెనుకనుండిపొడుచుట మంచిదనితలచి చైనావారిసేనలు హాంగుకాంగునుండి క్వాంటన్గుసరిహద్దుకుపోవురైలుబాటసమీపములో చేరినట్లును క్వాంటన్నుండికౌలూనుకుపోవురైలుబాటపొడవునను జపానీయసేనలపై దెబ్బలువేయుచున్నట్లును, అందువల్లజపానుసేనలు యాంగ్సీమధ్యభాగాలైన ఇచంగులవైపుపారిపోవుచున్నట్లును కాని ఇది పూర్తిగాతేలిపోవుచున్నాయనునది సందేహమైనట్లును-హాంగుకాంగుసరిహద్దుసమీపములో తాంఘుయి మరియు షెంగాయినులవద్దను క్వాంటనునుండి హాంకాంకుపోవురైలుబాటకు తూర్పునను జపానుసేనలతో చైనీయసేనలు చాలాతీవ్రముగా పోరాడుచున్నట్లును చైనాలోనికియాన్సి రాష్ట్రప్రధాననగరము నాంచాంగు ముట్టడియు, దానికి సమీపమున దిగువయాంగ్సీమీదను చైనాసేనలుజపానీయులతో పోరాడుచున్నట్లును డిసెంబరు ౧౨-౧౩-౧౪వ తేదీలలో వార్తలువచ్చినవి-కాని సింగపూరునుండివచ్చిన ఒకవార్తలో ఈ పోరాడుచున్న చైనాసేనలు కేవలము గొరిల్లాసేనలనియు-అందువల్ల ఆజపానుసేనలను ముందుకుపోనీయకుండ అపగలవాయనునది సందేహమనియు తెలుపబడినది,

ఎట్లయిననేమిఇప్పుడు ఆఖరువార్త ఏమనగాహాంగుకాంగుకు ౧౧వ తేదినుండిచైనాతో టెలిగ్రాం మున్నగువాటి సంబంధము విచ్ఛిన్నమైనదనియు, హాంగుకాంగువిమానాశ్రయమునుండి చైనావారలు వైమానికులను, మెషీనులనుఅన్నిటిని తీసికొని చైనాలోనిక్వాంటంగుకు ఓడలమీదుగాచేర్చినారు-ఇప్పుడుహాంగుకాంగుపూర్తిగా ముట్టడిచేయబడినట్లున్నదట. అసలుఅది జపానువారలకు లొంగిపోయినదని ఒకవార్తవచ్చినది- హాంగుకాంగుకుఈశాన్యమున ౨౦౦ మైళ్లదూరములో నుండు అమాయిఅనురేవుకు ఎదురుగనుండుకులాంగ్సుదీవిని జపానువారలాక్రమించినారు.

డిసెంబరు ౧౬వ తేదిఉదయం హాంగుకాంగుపై జపానువిమానాలు తీవ్రమైనదాడులనుచేసినవి.

ఇక పసిఫిక్ సముద్రములో అమెరికావారి ఫిలిప్పైనుదీవులపై జపానువారల దెబ్బలనుచూతము-ఇక్కడమనిలాదీవి జపాను చర్యలయందు ప్రాముఖ్యమునకువచ్చినది-ఈదీవియందలి ప్రజలలోనే జపానువారలగూఢచారులు జపానుచర్యలకు తోడ్పడుచున్నట్లు వార్తలువచ్చినవి- శత్రువుల విమానాలు వచ్చినపుడు వాటికి క్రింద ఏమియున్నదియు కనిపించకుండ క్రిందదీపాలన్నియు ఆర్పివేసి చీకటిచేసి యుంచవలెనుగదా! కానిమనిలాప్రజలు కొందరు రెండుమూడుసారులు జపానీయవిమానాలువచ్చినపుడు దీపాలు వెలిగించిజాడలు ఏర్పడునట్లుచేసిరట- ఇట్లుడిసెంబరు౧౫వ ౧౬వ తేదులలో రాత్రులందుజరిగినది- ఇప్పుడు ఈఫిలిప్పైనుదీవులయందు అనేకస్థలములపై జపానువిమానాలదాడులు తీవ్రముగా సాగుచున్నవి- డిసెంబరు౧౫వ తేదిన సూబిక్ అఖాతమున సముద్రతీరమునందున్న నౌకాస్థావరము మీదను మానిలాదీవి ఉత్తరమందు క్లార్కుఫీల్డుపైనను, మిన్దనావోయనుదీవిపై టూవాపుమీదను. లూజాన్ దీవికి వాయవ్యదిశన బటంగాస్ రాష్ట్రము మీదను జపానువిమానములు బాంబులనువేసినవి. డిసెంబరు ౧౬వ తేదిన కావైటులో నౌకాశ్రయముపై వేయబడినదెబ్బలవల్ల చాలాగొప్పనష్టముకలిగినదని అమెరికాఅధికారులు ఒప్పుకొనినారు. డిసెంబరు౧౭వ తేది మధ్యాహ్నమునకుముందు అనేకజపానీయ విమానాలువచ్చి మనిలాదీవి సరిహద్దులయందుఉండు సైనికస్థావరాలపై బాంబులనువేసినవి, కొన్నిజపానీయవిమానాలు అమెరికనులచే క్రిందకూల్చబడినవి- వేకుదీవిమీద ౧౫వ తేదిన దాడిచేసిన జపానీయవిమానాలలో రెండుక్రిందకూల్చబడెను-

జపానీయసేనలు లూజానులో అపారి, విగాన్ని, లెగజ్ అను ప్రదేశములలో మాత్రము కాలుత్రొక్కుకొని నిలువజాలుచున్నవి- కాంపొస్పవదమునకు తీరమునకుదూరమైన విగాన్వివద్ద జపానుసేనలుదిగినవి- లూజానులో జపానుసేనలు ఎక్కువయైనవి- లూజానులో లెగజ్, సాన్ఫెర్నాండో, లింగాయన్ అనుచోట్ల జపానువారిసేనలుదిగుచున్నవి. రుజ్యోగారో, ఇల్లిగాన్ అనుచోట్ల జపానుపారషూటిస్టులు దిగుచున్నారు, ఇంతవరకువచ్చినవార్తలవల్ల ఇట్టిజపానుసేనల ప్రయత్నములు అమెరికనులచే విఫలముచేయబడినట్లేకనబడుచున్నది- వేకుదీవిలోను, మిడ్వేదీవిలోను అమెరికనులసేనలు జపానుసేనలను దిగనీయకుండ ప్రతిఘటించుచునేయున్నవి.

అమెరికావారివిమానములు సేనలనుగొనిపోవుచున్న నాలుగుఓడలను సముద్రములోముంచివేసి, మూడింటిని పాడుచేసినవి, లూజాన్దీవిపై జపానీయసేనలు దిగునప్పుడు అమెరికనులవిమానములు వాటిపైబాంబులను వర్షించుచున్నవి- విగాన్విద్ద ౧౮వ తేదినరెండు జపానువిమానాలు ముంచివేయబడినవి- ఇప్పుడుహవాయిదీవులప్రాంతమందు శత్రుజలాంతర్గాములున్నట్లు అమెరికనులు ప్రకటించుచున్నారు, పోయినశనివారం హవాయిదీవులపై జపానువారలవిమానాలు దాడిచేసినపుడు వాటిలో౫౦క్రిందకూల్చబడినను, అమెరికనులు చెప్పుచున్నదేమనగా, జపానువారల విమానాలు తమవాటికంటె చాలఎక్కువగానుండెననియు, శత్రువైమానికులు నిర్ధారణగామంచి తెలివిగలవారలుగనుండిరనియు చెప్పుచున్నారు- యుద్ధప్రారంభమునుండిఇంతవరకు అమెరికావారికి మూడువిమానాలుమాత్రమే నష్టమైనవట- ఇప్పుడుఫిలిప్పైనుదీవులయందు పరిస్థితి అమెరికాఅధికారుల స్వాధీనానికివచ్చినదట-

డచ్చివారిఆర్చిపెలాగోదీవిమీదికికొన్నిచోట్లవచ్చినట్లు డిసెంబరు ౧౮వ తేదిన వార్తలువచ్చినవి- డచ్చివారినౌకలు ౧౫వ తేదినరాత్రి థాయిలాండుదక్షిణభాగమునపట్నానికిదూరమున సముద్రంలోసేనలను గొనిపోవుచుండిన నాలుగుఓడలనుముంచినవి- ౧౩-వ తేదిన మరిరెండుఓడలను ముంచివేసినవి బోర్నియోతూర్పుతీరమున జపానుసేనలతో డచ్చివారినౌకలుపోరాడి అనేకములైన జపానీయ మోటారులాంచీలను వశపరచుకొనినవట, ఇతరనౌకలను ధ్వంసముచేసినవట. చైనాసముద్రములో ఒకడచ్చికాపలానౌకపైకి మూడుశత్రువిమానాలురాగా అవి తరుమగొట్టబడినవి. ఇప్పుడు ఈస్టిండీసులోజపానువారు అడుగుపెట్టి ఆక్రమణచేయునట్లుఉన్న చోవారలను విలువగలదానంతయు కాల్చివేయుటకుఏర్పాటు చేయబడుచున్నది.

### తరువాతివార్తలు

డిసెంబరు ౧౫-వ తేదినను,౧౬-వ తేదినవచ్చిన వార్తలవల్ల బర్మాలో విక్టోరియాపాయింటువద్ద నుండి బ్రిటిషుసేనలు వెనుకకునిగానిపోబడినట్లును. మలయాలోకేడావద్దజపానుసేనలు కాలూనగలిగినట్లును అందుపై బ్రిటిషుసేనలు అక్కడినుండి కొంత వెనుకకుమరలించబడినట్లును, మలయా వాయవ్యమూలకు అవిచిరంతరముగాముందుకు సాగుచుపోయి బ్రిటిషువారి మొదటిరక్షణస్థానములను ధ్వంసించినట్లును తెలిసినది-జపానువారిప్పుడు మలయాను బర్మాకు సంబంధములేకుండ చేయజాలుచున్నారు.హాంగుకాంగునకు ౧౦౦ కౌలూను నుండి బ్రిటిషుసేనలు తరిమివేయబడుచున్నట-అమెరికాలో కాలిఫోర్నియా రాష్ట్రముపై జపాను విమానములు ౧౨,౧౩,౧౪వ తేదులలో ఎగిరినవట.

## తెలంగాణావాసులకు విజ్ఞప్తి

### ఆంధ్రమహాసభలో విరివిగా సభ్యులుగా చేరండి

చిలుకూరులోజరిగిన ౯వ ఆంధ్రమహాసభవరకు, సమావేశసందర్భమున ఒకరూపాయచెల్లించువారు మహాసభకుప్రతినిధులుగా ఎంచబడుచుండెడివారు.చిలుకూరుమహాసభలోఆనియమము మార్చబడి. క్రొత్తనియమము సిద్ధముచేయబడి,అంగీకరింపబడినది.

(౧౧) వనియమముప్రకారము ఎంతమంది ఎక్కువసంఖ్యలో ప్రాథమికసభ్యులుగాచేరిన అంతప్రాతినిధ్యము ఎక్కువగా ఆజిల్లాకు లభించుచున్నది. అనగా దేశసేవయందు అత్యధికాదరాభిమానములు, ఉత్సాహముగనపరచినవారికే స్థానములభించుచున్నది. కావున తెలంగాణావాసులెల్లరు హిందూ, మహమ్మదీయ, క్రైస్తవమతములనువారు మతవిచక్షణలేకుండా తమసమస్యలను చర్చించుకొనుటకు తెలంగాణావాసులకు ఏకైక, అవర్జనీయసంస్థయగు ఆంధ్రమహాసభలో చేరవలెను. సభ్యులుగాచేరువారు వృషసం॥ర మాఘశుద్ధ ౧౫(తేం ఇస్ఫందారు ౧౩౫౧)ఆదివారంలోగా తమస్థానికసంఘములో అనగా జిల్లా,తాలూకా, పట్టి, గ్రామసంఘములలో దేనిలోనైనను సభ్యత్వముక్రింద ౪ అణాలు చెల్లించినసభ్యులుగా ఎంచబడుదురు.

సభ్యులసంఖ్యనుబట్టి ఉద్యమముయొక్క అభివృద్ధి, దానితోపాటు దేశీయుల అభివృద్ధిఅగుచుండునని తెలంగాణావాసులు తెలిసికొన ప్రార్థన-

విధేయుడు
వట్టికోట అళ్వారుస్వామి,
ఆర్గనైజింగు సెక్రటరీ
ని-రా-ఆం-స్థాయిసంఘము

### ఇటాలీయనౌకలపై బ్రిటిషునౌకల దెబ్బలు

ఈడిసెంబరు ౧౪వ తేది సాయంకాలము చీకటిపడుటకుముందు మధ్యధరాసముద్రమధ్యభాగమందు దక్షిణదిశగా మూడుఇటాలీయ క్రూయిజరునౌకలు వేగముగాపోవుచున్నపుడు బ్రిటిషు జలాంతర్గామి ఒకటి వేగమునంది వాటిపైటార్పిడో దెబ్బలను వేసెనట. దానితర్వాత చాలగొప్ప ప్రేలుడు వినిపించినదట- ౧౫వ తేదిరాత్రి కడపటియామమందు ౩౫౦ కెం.వేళ ఆ దేశమధ్యధరాసముద్రమందు కాపలాకాయుచున్న బ్రిటిషుడిస్ట్రాయరులు మూడు ఒకనెదర్లాండు ప్రభుత్వమువారి డిస్ట్రాయరునౌకతోకలిసి రెండుఇటాలీయ క్రూయిజరునౌకలను, ఇటాలీయుల ఒక టార్పెడోనౌకను ఒక ఈబోటునౌకను గమనించినవై వాటిపైటార్పెడోలనువేసినవి- తత్ఫలితముగ ఒక ఇటాలీయక్రూయిజరునౌక పూర్తిగామునిగిపోయెను, రెండవదిచాలాచెడిపోయెను, ఈబోటుఅపుడే మునిగిపోయెను, ఈరెండురోజులలో బ్రిటిషువిమానాలు ఇదేసముద్రమందు శత్రువుల క్రూయిజరునౌకనొకదానిని ముంచివేసినవి, మరొకదానిని దగ్ధముచేసినవి-

# గోలకొండపత్రిక

వృషనామ సం॥ మార్గశిర బ॥౩౦

గురువారము


## ఆదర్శ గ్రామాలు

హైదరాబాదురాష్ట్రములోని గ్రామాలస్థితి తృప్తికరముగాలేదు దీనినిగమనించియే ప్రభుత్వమువారు గ్రామపునర్నిర్మాణ ప్రణాలికను సాగించుచున్నారు. అందులకు వారికిధన్యవాదములియ్యవలెను. గ్రామాలలో సంచారక వైద్యులనుపంపుచున్నారు.సినిమాలద్వారా ఆరోగ్యప్రచారముచేయుచున్నారు వేలకొలదిగా బావులనుగ్రామాలలోత్రవ్వించుచున్నారు. ప్రతితాలూకాలో ఒకఆదర్శగ్రామమును సిద్ధముచేయుచున్నారు. ఇవన్నియు నిజముగా ప్రశంసనీయమగు కార్యములు ఈకార్యములలోప్రజలు సహకారమును చూపవలెను. మనరాష్ట్రములో దాతలకు కొదువలేదు. ధనికులు తమద్రవ్యాన్ని గ్రామాల సౌకర్యములకై వినియోగించవలెను. ప్రభుత్వమువారొక్కరే యీకార్యమును సాగించవలెనను భావనఉండకూడదు. ప్రభుత్వోద్యోగులును తమప్రజలనుప్రేమించి వారియందు సానుభూతిని ఆదరణను చూపుచుండవలెను. కొన్నిస్థలములలో అట్టియుద్యోగులుకూడాకలరు. సర్. టాన్కరుగారు కొన్నిఏండ్లక్రిందట రాయచూరు జిల్లాపై తమదృష్టినిప్రసరించిరి.అచ్చటిలోపములను వారువ్యక్తపరిచి ఆజిల్లాలో చేయవలసిన అభివృద్ధిప్రణాళికను సిద్ధముచేసి ప్రభుత్వాంగీకారమునుపొందిరి తత్ఫలితముగా రాయచూరుజిల్లాలో త్రాగుడునీటి వసతులు, రోడ్లు, ఆరోగ్యసౌకర్యములు ఇవన్నియు చాలాప్రశంసనీయముగా వృద్ధిపొందింపబడెను.

ఇటీవలప్రభుత్వమువారు గ్రామపునర్నిర్మాణవిషయమై మంచిశ్రద్ధవహించుచున్నారు. ఇదిచాలా అవసరమగుకార్యము. మనగ్రామాలలో పెక్కుతావులలో మురికి,జాడ్యము, అనారోగ్యము అవిద్య, నిండియున్నవి పీటికితోడుగా రోడ్లయొక్కయు టప్పాయొక్కయు సౌకర్యాలుసరిగాలేవు. గ్రామమందలిజనులకు ముఖ్యముగా బాలబాలికలకుఆనందము, ఆరోగ్యము,కలిగించుఖేలనస్థలములును పరికరములును లేవు విద్యావంతులైనవారు గ్రామాలకుపోవుట కిచ్చగించరు జనులయిండ్లు గాలివెలుతురులేనివై అనారోగ్యమున అవకాశమిచ్చుపద్ధతులపై కట్టబడినవి. వీధులపారిశుద్ధ్యమునకేర్పాట్లులేవు. గ్రామములోపలను గ్రామముచుట్టును ఇండ్లచుట్టును మలినము మురికిపెంటలునిండియుండును. అంటుజాడ్యములలో ముఖ్యముగా నారులు, చలిజ్వరము టైఫాయిడ్, కలరా, మున్నగునవి గ్రామాలలో వ్యాపించుకొనిన జనులకుచాలానష్టములు కలిగించుచుండును. ఈకారణాలచేత ఇంకను ఎంతయోకష్టపడి జనులలోని యీలోపాలను తొలగించవలసియుండును.

రాయచూరుజిల్లాలో లింగుసూగూరుతాలూకాలో ఎక్లాసుపూరుఅను ౭౦౧ జనులుండుగ్రామమును ఒక ఆదర్శగ్రామముగా ఆజిల్లాలో నిర్ణయించి ప్రభుత్వమువారు ౧౯౪౦ నుండి మంచిప్రయత్నములుచేయుచున్నారని డై ౨౭ వనాటి దక్కన్ప్రభాత్ అనుకర్ణాటపత్రికలో అబ్దుల్ బాసితుబేగు హెచ్.సీ.యస్ అను అధికారిగారు వివరించి వ్రాసితెలిపియున్నారు ఆగ్రామమందు ప్రాతయిండ్లను పడగొట్టి క్రొత్తనమూనాయిండ్లను కట్టించిరనియు రోడ్లనువేసినారనియు, మురికిగుంటల పూడ్చినారనియు, సహకారసంఘమును స్థాపించి రైతులకు తోడ్పడుచున్నారనియు, ఒకడాక్టరును ఏర్పాటుచేసి గ్రామజనులకు మందులిప్పించుచున్నారనియు, ఆరోగ్యాదులనుగురించి జనులకు ఉపన్యాసాలిచ్చుచున్నారనియు, తెలిపినారు ఇంతేకాదు. ఆగ్రామములోనలుగురుదాతలు ౪౫౦౦ రూ॥ ఉచితముగా ఇచ్చిరట దీనితోనాలుగుగదులుకట్టి అందు నేత, బొమ్మలుచేయుట, అనుపరిశ్రమలుస్థాపించినారట అన్నింటికన్న విశేషమగువార్తయేమనగాఅక్కడి పట్వారీగారు ఒక పెద్దబడినికట్టించినారట. అందుఇప్పుడు ౭౦ మందిచదువుచున్నారు. మరియు అందరికిని నిర్బంధవిద్య చెప్పింపజూచుచున్నారు. పైగా ఒక రాత్రిపాఠశాలను నడుపుచున్నారు అందు 30 మంది వయోజనులు చదువుచున్నారు. బాలురకు ఖేలనస్థలము నేర్పాటుచేసి ఖేలనపరికరముల స్థాపించినారు ఒకవ్యాపారి బాలురకు ఉచితముగా బట్టలపంచిపెట్టుచున్నాడు ఇంకొకవర్తకుడు వారికుచితముగా సబ్బులనుపంచిపెట్టినాడు ఇంకను వ్యవసాయమునకు మంచివిత్తన సహాయము ఆదర్శమగుఎరువు గుంటలనిర్మాణము మున్నగునవి చాలాచేసియున్నారని పైఅధికారిగారు వ్రాసినారు. ఇదంతయు బాగున్నదికాని ఇండ్లుకట్టించినదాతలును- బట్టలుమున్నగునవి దానముచేసినదాతలును పైఅధికారిగారి వ్రాతలోఎందుకో అనామధేయులైయున్నారు వారి పేరులనువ్రాసి తెలుపవలసియుండెను

పై విషయాలనుబట్టి మనకు చాలావిషయములు గోచరించుచున్నవి గ్రామజనులే విశేషవ్యయమును భరించినారు గ్రామానికి ఆటస్థలమును ఖేలనవస్తువులు సమకూర్పబడినవి ఒక వైద్యుడున్నాడు మందులిచ్చుఏర్పాట్లుజరిగినవి విద్యకై నిర్బంధపు ఏర్పాటు చేయనున్నారు. గ్రామపారిశుద్ధ్యము బాగుగా విచారించుకొనబడుచున్నది- ఇవన్నియు మనరాష్ట్రములో ప్రతిగ్రామానికిని అవసరమైనవే. ఈవిధమైన ఏర్పాట్లకు ఆయాగ్రామాలవారును పై ఎక్లాసుపూరు దాతలవలె అధికారుల ప్రోత్సాహమును సుభూతి కలిగినచో సహాయపడగలని మావిశ్వాసము రాష్ట్రమంతయు ఎక్లాసుపూరువంటి గ్రామాలతోనే నిండియుండునట్లుగా ప్రభుత్వమువారును ప్రజలును నాయకులును, అందరును సమానముగా పరస్పరసానుభూతితో ప్రయత్నించి కృషిచేయుదురని కోరుచున్నాము.

---

## స్థానిక వార్తలు

హైదరాబాదు సికింద్రాబాదు నగరాలలో కూరగాయలుదొరకుట కష్టమైపోయినది- అందుచేత ప్రభుత్వమువారు బయటినుండి అవి దిగుమతి అగుటకు సౌకర్యాలనుఏర్పాటుచేసినారు ఔరంగాబాదుమండివచ్చు కూరగాయలపై రైల్వేరేట్లు తగ్గించినారు- ఒకసంవత్సరమువరకు పెలూనుండి కూడా హైదరాబాదు సికింద్రాబాదువరకు వచ్చు కూరగాయలపై మామూలిక్లైలుచార్జీలలో మూడవభాగముమే తీసుకొనబడును

రాయల్ ఇండియన్ నేవీలో చేరదలచినవారు ౧౯౪౨ జనవరి ౧౯ వరకు అర్జీలు చేరవలెను-వివరములకొరువారు ఫెడరల్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ కార్యదర్శి ఢిల్లీఅని వ్రాసి తెలుసుకొనగలరు.

మహబూబుకాలేజి వార్షికోత్సవము గౌ॥ రసిడెంటుబహద్దరుగారి యాజమాన్యమున ౧౭ డిసెంబరునాడు జరిగెను- ఆసందర్భములో గౌ॥ రసిడెంటుగారు యుద్ధమునకుగాను అందరును సహాయముచేయ వలసిన బాధ్యతనుగురించివివరించి చెప్పిరి- కాలేజీపక్షాన వినోదాలు బహుమానాలు అన్నియుమానుకొని దానినుండి మిగిలినసొత్తాన్ని యుద్ధానికై యిచ్చినందులకు గౌ॥ రసిడెంటుగారు తమకృతజ్ఞతను వెల్లడించిరి

హైదరాబాదులో నూతనముగా స్థాపితమైన లలితకళాపాఠశాలను మహామాత్యులవారుదర్శించిరి-వారివెంట నవాబు మెహిదీయార్జంగుబహద్దరుగారుండిరి-వీరు రెండున్నరగంటలకాలము పాఠశాలనుదర్శించి తమ ఆమోదమును వెలిబుచ్చిరి

హైదరాబాదునగరములో స్టాన్లీబాలికాపాఠశాలయొక్క నూతన భవనముల ప్రవేశోత్సవమును ప్రధానామాత్యులవారిచేత ౧౬ డిసెంబరునాడు కావించిరి- నవాబుగారు ఆ పాఠశాలవారు మనరాష్ట్రములో బాలికావిద్యకై చేయుచున్న సేవను చాలా ప్రశంసించిరి- ప్రభుత్వమువారు సెలకు ౭౫౦౦రూపాయలు ఈపాఠశాలకు ఇచ్చుచున్నందులకు ఈసాలలో మంచిపరీక్షాఫలితములుకలుగుచున్నందులకు చాలా సంతోషమును వెలిబుచ్చిరి

నాందేడులోని అజంజాహీ నేతమిల్లులో కూలీలు ఎక్కువకూలీయియ్యవలెనని సమ్మెకట్టి పనిమానివేసి ఒక వారముదినములయ్యెను-పోలీసువారుమిల్లులపై పహరా యిచ్చుచున్నారు సమ్మెను పరిష్కరించుటకు అధికారులు ప్రయత్నాలు చేయుచున్నారు

౨౧ డిసెంబరునాడు క్యాసెండ్ సంఘమువారు వార్షికోత్సవమును జరుపుచున్నారు

హైదరాబాదు రెడ్డిహాస్టలులో ౧౪ డిసెంబరు నాడుసాయంకాలము యాదవసంఘమువారిచే ఏర్పాటుచేయబడిన గీతాజయంత్యుత్సవము జరిగెను అనేక స్త్రీలునువచ్చియుండిరి- హాలంతయు సభ్యులచేనిండియుండెను-రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు అధ్యక్షత వహించవలసినవారైయుండిరి-కాని వారికి జబ్బుచేసియుండినందున రాజాలవందున శ్రీవల్లూరినూర్యనారాయణరావుగారు అధ్యక్షులైరి-శ్రీపండిత శేషాచార్య రామానుజస్వామిగారు గీతాప్రాశస్త్యమునుగురించి మాట్లాడిరి- సురవరప్రతాపరెడ్డిగారు గీతాజయంతి కార్తీక అమావాస్యనాడు చేయవలెననియు గీత లోకసంగ్రహానికేర్పడిన సర్వమతగ్రంథమనియు తెలిపిరి-పండిత వినాయకరావు విద్యాలంకారుగారు గీతకు లౌకికవ్యవహారానికుండుసంబంధాన్ని తెలిపిరి- అచ్యుతరామయ్యగారు గీతను ప్రతిహిందువు కూడా మననముచేయవలెనని తెలిపిరి-ఆర్యసమాజభజనికులిద్దరుభజనచేసిరి అధ్యక్షులవారు సభను రాత్రి౧౦గంటలకు ముగించుచు గీతాప్రాముఖ్యమును గురించి కొన్నిమాటలలో తెలిపిరి-

గౌ॥రెసిడెంటుగారు గ్రద్దివారి చికిత్సను తిలకించిరి

ఒక తుపద్రోలాపోయగాలో ధగయ పెరిగెందుకు తీతాకెక్కినగాజులవ్వాదలెవని సైనికపరమువారు తొందరజేసిరి కాని పోయగావారం గీకరింపకేకు అందుపై సేవలోనిభటులుహాస్టాల్ చేసినారు, తర్వాత వారు నవాబుగారికివేడుకవెళ్ళి తామికోరికలను తెలుపుకొనిరి నవాబుగారు సుముఖులైవారికేపోయినమున్ ఎక్కువజీతాలిత్తుమనిచెప్పినారు-

---

గాజకీయ ఖైదీయగు హీరాలాల్ కోటీచాగారి ఆరోగ్యము సరిగాలున్నా నాలేనా అని విచారించుటకు మూడువారాలపాటు ఉస్మానియాహైద్యాలయములో ఉంచిరనియు వైద్యులుఆతనినిపరీక్షించి ఏజాడ్యమున్నూలేదని తెలిపిరనియు వారు ఆరోగ్యముగాఉన్నారనియు ప్రభుత్వప్రకటనకాఖవారు ప్రకటించుచున్నారు

౧౫బహమన్ నాడు ధాన్యముధరలు పెరుగకుండా ఏర్పాట్లుచేయుటకై సాహుకారులసంఘమువారు ఆలోచనచేయునిమిత్తము కమిటీ చేయనున్నారు-

ఫిల్ము అనుపేరుతో నడుచుచుండిన ఉర్దూవారపత్రిక యిక ముందు సల్తనత్ అను పేరుతో నడుచును-

స్వామియోగీశ్వరానందఅను ఢిల్లీకాంగ్రెసు నాయకులు హైదరాబాదుకువచ్చి ఘూర్ గారి యింటిలో దిగియున్నారు-

హిందూస్థానకాంగ్రెసు అధ్యక్షులైన రావుసాహెబ్ శ్రీనివాసచారిగారు హైదరాబాదుకు ౧౯ డిసెంబరునాడు వచ్చుచున్నారు-

గ్రామముల సంస్కరణసంబంధములో సహాయముచేయుటకు హైదరాబాదులోనిస్త్రీలు ఒక వినోదప్రదర్శనము చేసిరి-అందు ౧౨౦౦ రూపాయలు వసూలయ్యెను ఈవిషయములో శ్రీవిరాయకరాణిగారు ముఖ్యశ్రద్ధవహించి సహాయపడిరి

గ్రద్దివారి చికిత్సకుగాను సహాయార్థముగా ఈక్రిందివారుచందాలు దానముచేసినారు

| | |
|---|---|
| కలీముద్దీన్ అన్సారీగారు | ౫౦ రూ |
| సయ్యద్షాఅబ్దుల్ హైగారు | ౧౦౦ రూ |
| సయ్యదబ్దుల్ జబ్బార్ గారు | ౫౦ రూ |
| రామదయాలుగారు | ౧౦౧ రూ |
| ముహేశగీర్జీగారు | ౧౦౧ రూ |
| రాంగోపాలుగారు | ౧౦౦ రూ |
| మొహియుద్దీన్ అహ్మద్ సాబ్ (పాతనాజిం కరోడ్గిరి) | ౧౦౧ రూ |
| మౌలాబక్షుగారు | ౧౦౦ రూ |

౧౯ డిసెంబరు శుక్రవారమునాడు సాయంత్రము ౬గంటలకు శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయములో శ్రీచిలుకూరివీర. శంకరరావుగారు హిందూస్థానీగానకాలక్షేపము చేయుదురు.

హిందీప్రచారసభవారు హైదరాబాదురెడ్డి హాస్టలులో ౨౩ డిసెంబరునాడు సాయంత్రము ౫గంటలకు రాజాప్రతాపగిర్జిగారి అధ్యక్షతలో హిందీప్రచారసభ చేయుదురు అలహాబాదు ప్రొఫెసర్ గారగుడాక్టర్ బాబూరాం సక్సేనాగారు ఉపన్యసింతురు.

గ్రద్దివారిచికిత్సచేసిన డాక్టర్ మధురాదాసుగారు ౧౯ డిసెంబరునాడు వెళ్ళిపోవుచున్నారు. వెళ్ళుటకుముందు ముఖరం నిజాంగారు వారికి దర్శనమిచ్చుచున్నారు

డాక్టరు జయసూర్యానాయుడుగారు సరోజినీనాయుడుగారికుమారులు జయసూర్యాగారి భార్యజర్మనువనిత, ఆమెబహుకాలము జబ్బుపడి ౧౨డిసెంబరునాడు చనిపోయెను-

కాసున్న చారిత్రక కాంగ్రెసు ఓరియంటల్ కాంగ్రెసులోని ముఖ్యోపన్యాసాలు రేడియోద్వారా వినిపింపబడును- ౨౦ డిసెంబరునాడు ౮- ౦ నుండి ౯-౫౦వరకు౨౧నాడు౨౨నాడు సుమారుమించుఅదేటైములోనువినిపింప బడును-

డాక్టర్ వీ-ఆర్ రెడ్డిగారు ౧౯ డిసెంబరునాడు హైదరాబాదువచ్చుచున్నారు

---

### గృహదహనం

(ఓ-వి) మాదెనపల్లి డిసెంబరు ౧౦

మాదెనపల్లిగ్రామం వరంగల్ తాలూకాలో చేరిన ఒక చిన్న గ్రామం నిన్నరాత్రి సుమారు ౧౦గంటలకు అకారణపుపోకిరాడుఅను ఒకహరిజనుడు-తప్పత్రాగి తమ్మునితోకలహించి యిల్లు తగులబెట్టెను-వాండ్లఅన్నదమ్ములవిమరియువాని యిల్లువాలుగుయిండ్లు కలిసిపోయెను-సదరు పోకిగాడు తాటికమ్మకునిప్పుఅంటించి వాలుగుయిండ్ల మార్గముఅంటుపెట్టి శివమెక్కినవానివలెనున కత్తిత్రిప్పుచుగ్రామజనులను యెవరినిదగ్గరకు రానుండా కరిమిచేసెను- పాపము, వాండ్లబట్టలు కొద్దిగా ధాన్యము తగులబడి ఓలబల్లవిచుచుటకునీడలేక అల్లాడుచున్నారు

---

## ఆంధ్రమహాసభా కార్యకారిణీ సభా సమావేశము

హైదరాబాదు బహమన్ ౧౧,- వృషసం॥ మార్గశిర బ॥ ౯ (౯-౩-౫౧౧) శుక్రవారముఉదయము ౫౦-౧౦-౩౦లకు ఆంధ్రమహాసభస్థాయిసంఘకార్యాలయములో కార్యకారిణీసభ సమావేశముజరిగెను

తీర్మానములు,-

౧-౧౮ బహమన్ ౧౩౫౧ శుక్రవారమునాడుజరుగనున్న స్థాయిసంఘ సమావేశములో,

౧-కొలమానపరిస్థితులు,

౨-రాజ్యాంగసంస్కరణలు,

౩-జాగీరులకుసంబంధించినచిత్తుకానూను

౪-కౌలుదారులకు

గురించి తీర్మానమును ప్రవేశపెట్టుటకై నిశ్చయింపబడెను

౨-ఈసంవత్సరము ఆంధ్రమహాసభా ప్రాథమికసభ్యత్వమునుముగించుటకు వృషసం॥ మాఘశు-౧౫ (౩౦ఇస్ఫందార ౧౩౫౧) ఆదివారము కడతేదిగా నిర్ణయించనైనది-

౩-అష్టమాంధ్ర మహాసభాహ్వానసంఘ ఆదాయవ్యయములను పరిశీలించుటకు ఆడిటరునియమించుఅధికారము అధ్యక్షులవారికిచ్చుచుతీర్మానించనైనది

---

## ఆంధ్రమహాసభాధ్యక్షుల పర్యటన

(ఓ-వి)

హైదరాబాదు, బహమన్ ౧౧-

నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభాధ్యక్షులగు శ్రీరావినారాయణరెడ్డిగారు, అర్గనైజింగుసెక్రటరీగారితో కామారెడ్డితాలూకా పర్యటనము ముగించుకొని ౭-బహమన్ సంగళవారమునభ్యాహ్నము ౫౦౧౧-౩౦లకైలులో నిజామాబాదు చేరుకొనిరి స్టేషన్ వద్దమహాసభకార్యకర్తలు స్వాగతమొసగిరి-ఈరోజు సాయంత్రమువరకు ముఖ్యకార్యకర్తలతో ఉద్యమవ్యాప్తినిగురించి మాట్లాడిరి-రాత్రికిరెడ్డిబోర్డింగునకువెళ్లి వీక్షించిరి

౭-బహమన్ బుధవారమునాడు ఉదయము బోధన్ తాలూకువెళ్ళి, అక్కడిదక్కన్ ఫ్యాక్టరీనివీక్షించి, నక్కరపైరులు సేద్యముచేయురైతుల కష్టములనువిచారించిరి- తిరిగి సాయంత్రమువరకు నిజామాబాదు చేరుకొనిరి

౮-బహమన్ గురువారమునాడు ఉదయము ఆర్మూరుచేరుకొని డిచ్పల్లిమీదుగా ౯-బహమన్ శుక్రవారమునాడు ఉదయమువరకు హైదరాబాదునకు విచ్చేసిరి

---

## ఆంధ్రమహాసభ స్థాయిసంఘం

(సుల్తానుబజారు, హైదరాబాదు)

౨౨ బహమన్ ౧౩౫౧ గురువారమునుండి ౨౯ బహమన్ గురువారమువరకు ఈరెండు రోజులలోనహా తెలంగాణములో వెట్టిచాకిరివారముజరుపుటకు నిశ్చయింపబడినది ఈవెట్టివిషయములో ౧౫ సంవత్సరములక్రితమే ప్రభుత్వమువారు నియమములు ఏర్పాటుచేసినప్పటికిని ఆచరణలో ప్రభుత్వోద్యోగులే భిన్నించుచున్నారు అందువలనప్రభుత్వమువారి ఆజ్ఞలను లేదనేగారిలకు ఎటువంటిపంటవారికి న్యాయముకలుగజేయుటకు వివ్యుక్తధర్మమనిరలచి ౧౫ ఆశ్వన్ నాటి ఆంధ్రమహాసభా కార్యకారిణీసభవారు ఈకార్యక్రమమును నిశ్చయించిరి కావున జిల్లాతాలూకా, పట్టి గ్రామసంఘ కార్యకర్తలను, యితరకార్యకర్తలను, పైతేదీలందు వివిధగ్రామములలో బహిరంగసభలమూలమున ప్రచారముచేయవలయును ఏతేదీన ఏగ్రామమున బహిరంగసభ జరిగెది ౫ రోజులకుముందే ఆలీఫ్ ఫారముప్రకారము మీజిల్లాతాలూకాదారుగారికి తెలుపవలయును,బహిరంగసభజరుపుటకు ప్రభుత్వమువారు అడ్డుపెట్టినచో తేగారివారి విధులకువెళ్లి ప్రభుత్వమువారి ఆజ్ఞలను నియమములనుచదివి, వివరముగా వినిపించవలెను-

వ అళ్వారుస్వామి

Golkonda Patrika

Volu 16 — No 63 | Published on every Monday and Thursday Hyderabad Dn | 18—12—1941

Pratibha's

# PARVATI KALYANAM

విడుదల తేది 21 డిసెంబరు 1941 ఆదివారము

సమయము మధ్యాహ్నము (మ్యాటినీ) 3 గంటలకు

## పార్వతీ కల్యాణము

సువర్ణావకాశము

పార్వతీ పరమేశ్వరులకు జరుగనున్న కల్యాణము చూడరండు!

ఈశుభసమయము జారవిడచి పశ్చాత్తాపానికి పాలుగావద్దు!

ఇందు

పురాణదంపతుల శృంగారము

... ... ..

అతి సున్నితమగు హాస్యము

.. ..

విస్మయం పుట్టించే అద్భుతము

... .. .. .

ఈరసప్రవాహాలు ఒకదాని మరొకటి

తోసుకొని పరుగెత్తినవి.

ఏపాటవిన్నను అమృతపుతేట- ఏమాట విన్నా ముద్దులమూట!!

నారదునిగానమే నాకలోకానందం

పార్వతీ జననము, శివునిపై ఆమెకుగల పవిత్రప్రేమ,

పార్వతీప్రేమ పరీక్షార్థం పరమేశ్వరుడు

ఆప్రేమమయిని పెట్టిన ముప్పుతిప్పలు చూచేమీారు

"ఏలోకములో ఉన్నామా" అని తప్పక అనుకుంటారు

ఇక పరమేశ్వరునకు పాములంటే పరమానందం

అవే ఆయన కలంకారాలు!

బ్రహ్మ, విష్ణు, నారద, ఇంద్రాది దేవతలు

పెండ్లి పెద్దలు!

పెండ్లికి నాట్యంలేనిదే సొగసు ఉండదు-

కనుకనే రతిమన్మథుల సుందరతర నాట్యం.

అనేకరంగులతో తీయబడిన

వసంతోత్సవ దృశ్యాలు

కల్యాణ మంటపాలంకారాలు

రకరకాల వాద్యాలు

కనవలె' వినవలె"

హాయి అనవలె''!

నటులు:- అభిమానపాత్రులు, అసమాన నటకులు

పారుపల్లి సత్యనారాయణ

రాధాకృష్ణయ్య

అభినేత్రి శ్రీమతి శాంతకుమారి

బాలాజీచిత్రంలో ప్రతిష్ఠగాంచిన నటీరత్నం)




కల్యాణమంటపము

# ఇంపీరియల్ టాకీస్

సికింద్రాబాదులో

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn Editor S. Prathapa Reddy B. A. B. L.